# అథ ఏకోనవింశో%ధ్యాయః

# లోక వర్ణనము

సనత్కుమార ఉవాచ |

రవిచంద్రమసోర్యావన్మయూఖా భాసయంతి హి | తావత్ర్పమాణా పృథివీ భూలోకస్స తు గీయతే || 1

భూమేర్యోజనలక్షే తు సంస్థితం రవిమండలమ్ | యోజనానాం సహస్రాణి సద్రైవ పరిసంఖ్యయా || 2

శశినస్తు ప్రమాణాయ జగతః పరిచక్షతే | రవేరూర్ధ్వం శశీ తస్థౌ లక్షయోజనసంఖ్యయా || 3

గ్రహాణాం మండలం కృత్స్నం శ##శేరుపరి సంస్థితమ్ | సనక్షత్రం సహస్రాణి దశైవ పరితోపరి || 4

బుధస్తస్మాదథో కావ్యస్తస్మాద్భౌమస్య మండలమ్ | బృహస్పతిస్తదూర్ధ్వం తు తస్యోపరి శ##నైశ్చరః || 5

సప్తర్షిమండలం తస్మాల్లక్షేణైకేన సంస్థితమ్ | ఋషిభ్యస్తు సహస్రాణాం శతాదూర్ధ్వం ధ్రువః స్థితః || 6

మేఢీభూతస్స యస్తస్య జ్యోతిశ్చక్రస్య వై ధ్రువః | భూర్భువస్స్వరితి జ్ఞేయం భువ ఊర్ధ్వం ధ్రువాదవాక్ || 7

ఏకయోజనకోటిస్తు యత్ర తే కల్పవాసినః | ధ్రువాదూర్ధ్వం మహర్లోకస్సపై#ౖతే బ్రహ్మణస్సుతాః || 8

సనకశ్చసనందశ్చ తృతీయశ్చ సనాతనః | కపిలశ్చాసురిశ్చైవ వోఢుః పంచశిఖస్తథా || 9

ఉపరిష్టత్తతశ్శుక్రో ద్విలాక్షాభ్యంతరే స్థితః | ద్విలక్షయోజనం తస్మాదధస్సోమసుతస్స్మృతః || 10

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఎంతవరకు సూర్యచంద్రులు కిరణములు ప్రకాశింప జేయునో, అంతవరకు గల పృథివి భూలోకమనబడును (1). ఖచ్చితముగా అంచనావేయగా, సూర్యమండలము భూమికి లక్ష యోజనముల దూరములో నున్నదని నిర్ధారించ బడినది. చంద్రమండలము ఎల్లప్పుడు భూమికి కొన్ని వేల యోజనముల దూరములో నుండును. చంద్రుడు సూర్యుని పైన లక్ష యోజనముల దూరములో నున్నది (4). ముందుగా బుధుడు గలడు. ఆపైన శుక్రుడు, ఆ పైన కుజమండలము, ఆ పైన గురువు, ఆ పైన శని గలరు (5). ఆ పైన లక్షయోజనముల దూరములోసప్తర్షి మండలము గలదు. సప్తర్షులకు లక్ష యోజనముల ఎత్తులో ధ్రువమండలము గలదు (6). ధ్రువమండలము నక్షత్రచక్రమును నిలబెట్టే స్తంభము వంటిది. భూమికి పైన ధ్రువమండలమునకు క్రిందకు భువః, సువః అనే లోకములు గలవు (7). ధ్రువనక్షత్రమునకు కోటి యోజనముల పైన మహర్లోకము గలదు. అచట బ్రహ్మపుత్రులు ఏడుగురు కల్పము ఉన్నంత వరకు నివసించెదరు (8). సనకుడు, సనందుడు, సనాతనుడు, కపిలుడు, ఆసురి, వోఢుడు, పంచశిఖుడు అనునవి వారి పేర్లు (9). దానికి పైన రెండు లక్షల యోజనముల లోపులో శుక్రుడు, రెండు లక్షల యోజనముల క్రింద బుధుడు గలరు (10).

ద్విలక్షయోజనం తస్మాదూర్ధ్వం భౌమః స్థితో మునే |
ద్విలక్షయోజనం తస్మాదూర్ధ్వం జీవః స్థితో గురుః || 11

ద్విలక్షయోజనం జీవాదూర్ధ్వం సౌరిర్వ్యవస్థితః | ఏతే సప్తగ్రహాః ప్రోక్తాస్స్వస్వరాశివ్యవస్థితాః || 12

రుద్రలక్షైర్యోజనతస్సప్తోర్ధ్వమృషయః స్థితాః | విశ్వలక్షైర్యోజనతో ధ్రువస్థితి రుదాహృతాః || 13

చతుర్గుణోత్తరే చార్ధ్వే జనలోకాత్తపస్స్మృతమ్ | వైరాజా యత్ర దేవా వై స్థితా దాహవివర్జితాః ||14

షడ్గుణ   న తపోలోకాత్సత్యలోకో వ్యవస్థితః | బ్రహ్మలోకస్స విజ్ఞేయో వసంత్యమలచేతసః || 15

సత్యధర్మరతాశ్చైవ జ్ఞానినో బ్రహ్మచారిణః | యద్గామినో%థ
భూలోకాన్నివసంతి హి మానవాః || 16

భువర్లోకే తు సంసిద్ధా మునయో దేవరూపిణః | స్వర్గలోకే
సురాదిత్యా మరుతో వసవో%శ్వినౌ || 17

విశ్వే దేవాస్తథా రుద్రాస్సాధ్యా నాగాః ఖగాదయః | నవగ్రహాస్తతస్తత్ర
ఋషయో వీతకల్మషాః || 18

ఏతే సప్త మహాలోకాః కాలేయ కథితాస్తవ | పాతాలాని చ సప్తై#్తవ
బ్రహ్మాండస్య చ విస్తరః || 19

దధివృక్షఫలం యద్వద్వృత్తిశ్చోర్ధ్వమధస్తథా | ఏతదండకటాహేన
సర్వతో వై సమావృతమ్|| 20

దశగుణ న పయసా సర్వతస్తత్సమావృతమ్ | వహ్నినా వాయునా
చాపి నభసా తమసా తథా || 21

ఓ మునీ ! దానికి రెండు లక్షల యోజనముల పైన శుక్రగ్రహము గలదు. దానికి రెండు లక్షల యోజనముల పైన గురుగ్రహము గలదు (11). గురువునకు రెండు లక్షల యోజనముల పైన శని గలదు. ఇంతవరకు చెప్పబడిన ఏడు గ్రహములు తమ తమ రాశులలో నుండును (12). శనికి పదకొండు లక్షల యోజనముల పైన సప్తర్షిమండలము, పదునాల్గు లక్షల యోజనముల పైన ధ్రువనక్షత్రము గలవు (13). జనలోకము నుండి అరవై మూడు లక్షల యోజనముల పైన తపోలోకము గలదని చెప్పబడినది. అదియే బ్రహ్మలోకమని తెలియదగును. పవిత్రమగు అంతఃకరణము గలవారు, సత్యమునందు మరియు ధర్మము నందు ప్రీతి గలవారు, జ్ఞనులు, బ్రహ్మచారులు అగు మానవులు భూలోకమునుండి వెళ్లి, అచట నివసించెదరు (15, 16). గొప్ప సిద్ధులుగల మునులు దేవరూపమును దాల్చి భువర్లోకమునందు నివసించెదరు. స్వర్గలోకమునందు దేవతలు, ఆదిత్యులు, మరుత్తులు, మసువులు, అశ్వినీదేవతలు, విశ్వేదేవతలు, రుద్రులు, సాధ్యులు, నాగులు, ఖగులు మొదలగువారు

నివసించెదరు. దానికి పైన నవగ్రహములు, ఆ పైన పాపసంబంధము లేని సప్తర్షులు ఉండెదరు (17,18). ఓ కాలీనందనా ! నేను నీకు ఈ ఏడు మహాలోకములను గురించి చెప్పితిని, పాతాళములు కూడ ఏడు గలవు. ఈ విధముగా బ్రహ్మాండము విస్తరించి యున్నది (19). కపిత్థవృక్షము యొక్క ఫలములు నేలకు క్రింద మరియు పైన కూడ వ్యాపించియుండును. అదే విధముగా, క్రింద మరియు పైన అంతటా వ్యాపించి యున్న ఈ జగత్తు రెండు అర్ధభాగముల రూపములో బ్రహ్మాండము లోపల ఇమిడి యున్నది (20). ఈ బ్రహ్మాండము పదిరెట్లు పరిమాణము గల నీటిచేత, అగ్ని-వాయు-ఆకాశములచేత మరియు చీకటిచే అంతటా చుట్టువారబడి యున్నది (21).

భూతాదినాపి మహత దిగ్గుణోత్తరవేష్టితః |మహాంతం చ సమావృత్య ప్రధానం పురుషః స్థితః || 22

అనంతస్య న తస్యాస్తి సంఖ్యాపి పరమాత్మనః | తేనానంత ఇతి ఖ్యాతః ప్రమాణం నాస్తి వై యతః || 23

హేతుభూతస్సమస్తస్య ప్రకృతిస్సా పరా మునే | అండానాం తు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ|| 24

ఈదృశానాం ప్రభూతాని తస్మాదవ్యక్తజన్మనః | దారుణ్యగ్నిస్తిలే తైలం పయస్సు చ యథా ఘృతమ్ || 25

తథాసౌ పరమాత్మావై సర్వం వ్యాప్యాత్మవేదనః | ఆదిబీజాత్ప్రసువతే తతస్తేభ్యః పరేండజాః || 26

తేభ్యః పుత్రాస్తథాన్యేషాం బీజాన్యన్యాని వై తతః | మహదాదయే విశేషాంతాస్తద్భవంతి సురాదయః || 27

బీజాద్వృక్షప్రరోహేణ యథా నాపచయస్తరోః | సూర్యకాంతమణ   స్సూర్యాద్వద్వహ్నిః ప్రజాయతే || 28

తద్వత్సంజాయతే సృష్టిశ్శివస్తత్ర న కామయేత్ | శివశక్తిసమాయోగే దేవాద్యాః ప్రభవంతి హి|| 29

తథా స్వకర్మణైకేన ప్రరోహముపయాంతివై | బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ స శివః పరిగీయతే || 30

తస్మాదుద్ధరతే సర్వం మస్మింశ్చ లయమేష్యతి | కర్తా క్రియాణాం సర్వాసాం స శివః పరిగీయతే || 31

పంచభూతములకు కారణమైనది, బ్రహ్మాండమునకు ఎనిమిది రెట్లు పరిమాణము గలది అగు మహత్తత్త్వముచే బ్రహ్మాండము చుట్టువారబడి యున్నది. మహత్తత్త్వమును మరియు ప్రధానమును చుట్టువారి పురుషుడు (పరమాత్మ) గలడు (22). ఆ పరమాత్మ ఇన్ని రెట్లు పెద్దవాడు అనే సంఖ్యను చెప్పుట సంభవము కాదు. ఆయనకు పరిచ్చేదము లేదు. అందువలననే, ఆయనకు అనంతుడని పేరు వచ్చినది (23). ఓ ముని! ఆ అనంతుడే సర్వమునకు కారణుడు. ఆయనయే పరాప్రకృతి. వ్యక్తము కాని జన్మ గల ఆ పరాప్రకృతి నుండి వేల, పదివేల, లక్షల సంఖ్యలో ఈ బ్రహ్మాండము వంటి బ్రహ్మాండములు పుట్టుచున్నవి. ఆత్వస్వరూపమును తెలుసుకొని యున్న ఆ పరమేశ్వరుడు కర్రలో నిప్పువలె, నువ్వులలో నూనె వలె, పాలలో నేయి వలె అంతటా వ్యాపించి యున్నాడు. ఆదిబీజమగు ఆ పరమేశ్వరునినుండి మహత్తత్త్వముతో మొదలిడి పరమాణు విశేషముల వరకు గల సర్వ ప్రకృతివికృతులు, దేవతలు, పక్షులు,వాటి సంతానము, ఇతరప్రాణులు, వాటి బీజములు సర్వప్రాణుల ఆహారములు ఇత్యాది సర్వము పుట్టినవి (24, 27). బీజమునుండి చెట్టు పుట్టిననూ, అది చెట్టునకు లోటు కాదు. సూర్యకాంతమణిపై సూర్యకిరణములు పడినప్పుడు నిప్పు పుట్టును (28). అదే విధముగా, సృష్టి ఉద్భవించుచున్నది. శివునకు దానియందు కామన (సంగము) లేదు. శివశక్తుల సమాగమముచే దేవతలు మొదలగు ప్రాణులు పుట్టుచున్నవి (29). ఆ శివుడు ఒక్కడే తాను చేసే పనులను బట్టి బ్రహ్మ-విష్ణు-రుద్ర-రూపములలో ప్రకటమగుచున్నాడు (30). శివుని నుండియే సర్వము

ఉద్భవించుననియు, సర్వము ఆయనయందు మాత్రమే లయమగుననియు, సర్వక్రియలకు కర్త ఆ శివుడేననియు మహర్షులు కీర్తించుచున్నారు (31).

వ్యాస ఉవాచ |

సనత్కుమార సర్వజ్ఞ ఛింధి మే సంశయం మహత్ | సంతి లోకా హి బ్రహ్మాండాదుపరిష్టాన్న వా మునే || 32

వ్యాసుడు ఇట్లు పలికెను -

ఓ సనత్కుమారా! నీవు సర్వజ్ఞుడవు. నాకు ఒక పెద్ద సందేహము గలదు.దానిని పోగొట్టుము. ఓ మునీ ! బ్రహ్మాండమునకు పైన లోకములు ఉన్నవా?లేవా? (32).

సనత్కుమార ఉవాచ |

బ్రహ్మాండాదుపరిష్టాచ్చ సంతి లోకా మునీశ్వర | తాన్ శృణు త్వం విశేషేణ వచ్మి దే%హం సమాసతః || 33

విధిలోకాత్పరో లోకో వైకుంఠ ఇతి విశ్రుతః | విరాజతే మహాదీప్త్యా యత్ర విష్ణుః ప్రతిష్ఠితః || 34

తస్యోపరిష్టాత్కౌమారో లోకో హి పరమాద్భుతః | సేనానీశ్శంభుతనయో రాజతే యత్ర సుప్రభః || 35

తతః పరముమాలోకో మహాదివ్యో విరాజతే | యత్ర శక్తిర్విభాత్యేకా త్రిదేవజననీ శివా || 36

పరాత్పరా హి ప్రకృతీ రజస్సత్త్వతమోమయీ | నిర్గుణా చ స్వయచం దేవీ నిర్వికారా శివాత్మికా || 37

తస్యోపరిష్టాద్విజ్ఞేయశ్శివలోకస్సనాతనః | అవినాశీ మహాదివ్యో మహాశోభాన్వితస్సదా || 38

విరాజతే పరం బ్రహ్మ యత్ర శంభుర్మహేశ్వరః | త్రిదేవజనాకస్స్వామీ సర్వేషాం త్రిగుణాత్పరః || 39

తత ఊర్ధ్వం న లోకాశ్చ గోలోకస్తత్సమీపతః |
గోమాతరస్సుశీలాఖ్యాస్తత్ర సంతి శివప్రియాః || 40

తత్పాలః కృష్ణనామా హి రాజతే శంకరాజ్ఞయా |ప్రతిష్ఠితశ్శివేనైవ శక్త్యా స్వచ్ఛందచారిణా || 41

శివలోకో%ద్భుతో వ్యాస నిరాధారో మనోహరః | అతినిర్వచనీయశ్చ నానావస్తు విరాజితః || 42

శివస్తు తదధిష్ఠాతా సర్వదేవశిరోమణిః | విష్ణుబ్రహ్మహరైస్సేవ్యః పరమాత్మా నిరంజనః || 43

ఇతితే కథితా తా సర్వబ్రహ్మాండసంస్థితిః తదూర్ధ్వం లోకసంస్థానం కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి || 44

ఇతి శ్రీ శివమహాపురాణ   ఉమాసంహితాయం లోకవర్ణనం నామ ఏకోనవింశో%ధ్యాయః (19).

సనత్కుమారుడు ఇట్లు పలికెను -

ఓ మహర్షీ! బ్రహ్మాండమునకుపైన లోకములు గలవు. నేను నీకు ఆ వివరములను సంగ్రహముగా చెప్పెదను. నీవు వినుము (33). బ్రహ్మలోకమునకు పైన వైకుంఠము గలదు. అది గొప్ప కాంతులతో ప్రకాశించుచుండును. అచట విష్ణువు స్థిరముగా నుండును (34). దానికి పైన పరమాద్భుతమగు కౌమారలోకము గలదు. అచట గొప్ప తేజశ్శాలి, శంభుపుత్రుడు, దేవసేనానాయకుడు అగు కుమారస్వామి ప్రకాశించుచున్నాడు (35). దానికి పైన మహాదివ్యమైన ఉమాలోకము విశేషముగా ప్రకాశించుచున్నది. అచట అద్వయవక్తిస్వరూపిణి, త్రిమూర్తులను సృష్టించినది అగు శివపత్ని ప్రకాశించుచున్నది (36). మహత్తత్త్వము మొదలగు వాటికంటె ఉత్కృష్టురాలగు ఆ దేవి రజస్సత్త్వమోగుణస్వరూపురాలై జగత్తునకు ప్రకృతి యైనది. ఆమె స్వయముగా గుణసంబంధము లేనిది. మంగళస్వరూపురాలగు ఆమెయందు వికారములు లేవు (37). ఆ లోకములనకు పైన శాశ్వతమగు శివలోకము గలదని తెలియవలెను. వినాశము లేని ఆ లోకము మహాదివ్యమైనది

మరియు సర్వకాలములలో గొప్ప శోభను కలిగియుండునది (38). అచట పరంబ్రహ్మ, మహేశ్వరుడు, త్రిమూర్తులకు తండ్రి, సర్వులకు ప్రభువు, త్రిగుణములకు అతీతుడు అగు శంభుడు విశేషముగా ప్రకాశించుచున్నాడు (39). దానికి పైన లోకములు లేవు. దానికి సమీపములో గోలోకము గలదు. అచట సుశీలలు అనే పేరుగల, శివునకు ప్రియమైన గోమాతలు ఉండును (40). శ్రీకృష్ణుడు శంకరుని ఆజ్ఞచే వాటిని పాలించును. తన శక్తిచే యథేచ్ఛగా సంచరించే శంకరుడు స్వయముగా ఆయనను అచట ప్రతిష్ఠించినాడు (41). ఓ వ్యాసా! ఆధారము లేనిది, మనోహరమైనది, అతిశయించి వర్ణింపదగినది, అనేకవస్తువులతో విశేషముగా ప్రపకాశించునది అగు శివలోకము అద్భుతముగా నుండును (42). సర్వదేవతాశిరోమణి, విష్ణుబ్రహ్మరుద్రులచే సేవింపబడువాడు, పరమాత్మ, అసంగుడు అగు శివుడు దానని అధిష్ఠించి యుండును (43). ఓ వత్సా! ఈ విధముగా నేను నీకు సకలబ్రహ్మాండముల సంస్థితిని, దానికి పైన గల లోకముల సంస్థితిని చెప్పితిని. నీవు ఇంకనూ ఏమి వినగోరుచున్నావు? (44).

శ్రీ శివమహాపురాణములో ఉమాసంహితయందు లోకవర్ణనమనే పది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).